స్వర్గాధినాథుడు నేడూ!      రథమెక్కి,
పయనమై పోతువున్నాడు!

భర్త్యాలులేకనే వాడు,      పెళ్లికి
బాజాలు వేయించినాడు!

బండరాళ్లపైని వాడు,      చక్రములు
బడబడా దొర్లించినాడు!

బాణసంచా వెలితి లేదే,      పెళ్లికి
బహుబాగుగా చేసినారె!

కళ్లుచెదిరే మెరుపులమ్మా,      చూడు
వళ్లు పరవశమౌను సుమ్మా!

కప్పమ్మపెళ్లికో యంచూ,      మేళములు
గొప్పగ తెప్పించినారె!

చెప్పశక్యముగాదు వేరే,      బోదురూ
కప్పలామేళములు రారె!

కప్పమ్మ గడపతొక్కినదీ,      శుభమన్న
సూచనలు చూరు చెప్పినది!

కప్పు తెగిరే వానలమ్మా,      పొలములూ
కనకమే పండుతాయమ్మా!

బంగారమ్మ

వర్షాగమము

రసికహృదయము లోలలాడే
మనువుదినములు నురలివచ్చెను,
మిసిమిమబ్బులు వ్రేలు మేలిమి
మునుగుతో నాకసము విచ్చెను!

తరలి రా, ఆషాఢలక్ష్మీ
మెరపుతీవలుతోలకు రథమున,
మురిపెమున దిక్కాంత లలరగ
తరలిరా, మేఘములపథమున!

పదికెలంకుల నూడ్చి వల్లీ
మదవతులు కానుకల నుంచిరి,
మొదటిచినుకులతోడ మెఱసే!
పొదుపుతో మోములను వంచిరి!

వేకువలలో శంఖ మొత్తుచు
లోకముల నిక మేలుకొల్పుము,
శ్రీకరములగు తఱిపివానల
శీకరము వాకిళ్ల నిల్పుము!

మంగళస్నానమ్ము లారిచి
    చెంగలించెడు నీటికాలువ
పొంగిపోయె; నొసంగు పృథివీ
    ప్రాంగణములకు పచ్చశాలువ!

అడవికోనలలోన నీకై
    యెదురువేచిన నెమిలికన్నెల
కడుపుకోతల మాన్పి, దాహము
    లుడిపి పఱపుము చల్లవెన్నెల!

ఉరుము లురిమెడుగర్జనమ్ముల
    మెరుపుతీవల మేలవింపుము,
మురిసియాడెడు వానచినుకుల
    నరసగానము లాలకింపుము!

ఆబ్బూరి

కా ర్తి క పూ ర్ణి మ

పక్షుల్లు పలుకకే పడియుండినాయి,
వృక్షాలు చూచుచూ పూరకున్నాయి,
    తనవెంటపడుతున్న
    తరుణి జూడ డిదేమి!
పోతువున్నాడు తాను,
అడుగడుగో పొంగులోకాలు గనను!

గాలి ఉయ్యాలలై కదులుతుండెడిమబ్బు
కనుల కడ్డమురాగ, కాళ్లైన తడబడగ,
పోవుతున్నాడు తాను!
తన గర్వపొంకములు దెలుపుతూను!

వాద్యములు వినబడవో, చోద్యములుఁ కనబడవో
నిముసంబు నిలువ దేనీడ నిలుచునోగాని,
పోతువున్నాడు తాను!
గర్వంపుపొంగు బోకారిపోను!

పక్షికలకలములే పరిభవం బని యెంచి,
తెల్లబోయిన మోము తెలియకుండుటకునై,
పోతువున్నాడు తాను!
తను వెల్ల తారుమా రగుటచేను!

బంగారమ్మ

## ప్రతీక్ష

ఉదయభానుడు పంచిపోయిన
హృదయసౌవర్ణ జ్వాలన్మణు
లోదిగి యొదిగి యనంతకాలవు
టుదరమున మణగెన్!

ఉదయబాలవిహంగమంబుల
మృదులకై శోర శ్రుతులపై
గుదులు గుదులుగ కాలచోరుడు
వదలు బాణమ్ముల్ !

ప్రాతరరుణ నవసువర్ణ
జ్యోతులూగే తూర్పుదిక్కున
లో తెరుంగని కాళరాత్రులు
రాతులై నిలచెన్ !

పె ను మ ర్తి

## అ ం ధ కా ర ము

కారుచీకటి పేరుకొనియెను,
కదలి, మ్రోతల మారుమ్రోగెను,
దారుణంబగు నంధకారము,
దారి తెలియదుగా !

అచ్చటచ్చట మిణుగురైనను
జొచ్చి వెదకిన లేదు కనగా,
హెచ్చుమోదముతోడ నేగెద
వేమి కనుగొనగా ?

భయముగొల్పెడు కారుసంద్రము
బాగుగా గనుగొందువా, యట?
పార మెరుగని ఆయెడారిని
భయము పుట్టనుగా!

చే తెరుంగవు, పా తెరుంగవు,
చెప్పినను వినరాదొక్కో, యట
కారుచీకటి భోరుమనియెను
కడలిమ్రోతలతో!

విశ్వసుందరమ్మ

తమస్సు

కను మూసి లేచాను, వెనుదిరిగి చూశాను,
కనలేదు ఆజంట, వినలేదు ఆజాడ,
గుండె గుబగుబలాడెను,
నాగొంతు
ఎండి, గుటకడదాయెను!

పిలిచాను పిలిచాను, అలసిపోయాను,
అలసిపోయినగుండె అల్లె ముడి, విడిపోవ
ఆకాశమున కెగిరితి,
అక్కడా
అంధకారమె చూసితి!

కేక వినబడదాయె, చూపు కనబడదాయె,
అంధకారములోన అట్టె రెక్కలు ముడిచి
అవనిపై నే బడితిని
అక్కడా
అంధకారమె గంటిని !

బంగారమ్మ

## ఒకరాత్రి

గగనమంతా నిండి
పొగలాగు క్రమ్మి
బహుళపంచమిజ్యోత్స్న
భయపెట్టుతోంది !

ఆకాసపుటెడారి
అంతటా, అకట !
ఈ రేయి రేగింది
ఇసుకతుపాను !

గాలిలో కనరాని
గడుసు దయ్యాలు,
భూదివమ్ములమధ్య
ఈదుతున్నాయి !

నోరెత్తి హోరెత్తి
నాగులను కడలి,
కరికళేబరములా
కదలదు కొండ,

ఆకాశపుటెడారి
లో, కాళ్లు తెగిన
ఒంటరిఒంటెలా
గుంది జాబిల్లి,

విశ్వ మంతా నిండి,
వెలిబూదిపోలె,
బహుళపంచమిజ్యోత్స్న
భయపెట్టుతోంది!



దీ పా వ ళి నా డు

ని శీ థి ని:

జగతి యీనాఁటియీమహోత్సవమునందు
మునిఁగి యానందమునఁ బొంగిపోవుచుండ,
ఇటు రగులుకొల్పి రెవరు నీ హృదయమందు
నణఁచుకొనియున్న ఘోరదుఃఖాగ్ని నివుడు?

నే ను :

కాఱుకొన్న యమానచీఁకటులనడుమ
నే నొకండనె ఈశూన్యగృహమునందు
అదురువడిపోయి మరణవాద్యమ్ములట్లు
గుండియలు కొట్టుకొన నేడ్చుకొనుచునుంటి !

ఇంతగ దహించుకొనిపోవు నీయెడంద
బాష్పములు జారిపడి చల్లఁబడునో యనుచు
మూసికొనిపోయె నా నేత్రములు దమంత,
రాత్రియే ఇంక బహిరంతరముల నాకు !

విస్మృతోదంతములు శూన్యవీథులందు
నావలెనె మౌనముగ వెళ్లిపోవుచున్న
ఓనిశీథిని ! నీ గభీరోదరమున
దొరికె నీ దురదృష్టవంతునకుఁ జోటు !

చి ష్ట ట :

బాణనంచుల ఫెళఫెళార్భటులు విరిసి
దశదిశాంతరములఁ బ్రతిధ్వనుల నీన,
పేదవడియున్న మౌనజీవితపుటాశ
లిపుడు మ్రోఁగించుకొనుచుంటివేల నీవు ?

నేను :

నన్ను నిరసించువారియానందమందు
నాకు భాగమ్ము వల దొక్క నాఁటికైన,
చీఁకటులఁ జీల్చికొనివచ్చు నీ కరాళ
గానరవములనే నా సుఖమ్ము కలదు!

దినములు పరస్పర ప్రతిధ్వనులు కాఁగ
ఇరువదై దేండ్ల నా బ్రతు కిట్టె గడచె,
ఈరహోదుఃఖవీథులం దే నెఱుంగ
సఖులయడుగులజాడ లీసరికిగూడ !

ఎడ తెఱిపిలేనికన్నీటిజడులఁ దడిసి
పంకిలమ్మైనజీవనప్రాంగణమున
శాంతిదేవతాచరణలాక్షారసారు
ణాంక లవలేశముల వెతుకాడుకొందు !

గొంతు విప్పక లోలోనఁ గుమిలి కుమిలి,
యెంతయేడ్చినఁ బగిలిపో దీయెడంద;
ఆకొనినయాశ లెప్పటికప్పు డవియె
కలయఁ ద్రిప్పును స్వప్నసాగరతటాల !

మృత్యుగర్జాప్రవాహగంభీరమైన
విధి నిదురవోవు ప్రేమజీవితములోన
సంఘటిలిన ప్రవాసదుస్స్వప్నవ్యథల
మడతలను సర్దుకొనుచుందు మాయకుండ !

తెగిపడినపూలదండ లెత్తుగ నమర్చి,
అంధకారమ్ము సందిట నదుముకొనుచు,
నెవరికోఅకో పదేపదే యెదురుచూచు
నాయెన కొనర్తుఁ గృత్రిమానందభిక్ష!

మ్రొక్కినకొలందిఁ గాలితోఁ ద్రొక్కుచున్న
యీఁకఠినలోక మెల్ల బహిష్కృతమ్ము;
రండు, చిమ్మటలార! ఈరాత్రివేళ
నావలెనెపాడుకొను మీరె నాకు సఖులు!

వేదుం

అంధ భిక్షువు

అతఁడు, రైలులో నేఁ బోయినప్పుడెల్ల
నెక్కడో యొక్కచోటఁ దా నెక్కు - వాని
నతనిభూతురు నడిపించు ననుసరించు.

అతఁడు దాశరథీశతకాంతరస్థ
మైన యాపద్యమె పఠించు ననవరతము.

అతని యాగొంతు కట్లనే - అతఁడు పూర్వ
జన్మమందు నేనూతిలోననో చచ్చిపోవు
చెంతపిలిచిన వినువారలేని లేక,

ఆ పిలుపు ప్రాణకంఠమధ్యములయందు
సన్నవడి సన్నవడి నేటిజన్మ నతని
కనుచు వెదకుచు వచ్చి చేరినది కాక -

అతని కన్నులా బా స్తలే - ఆసమయము
నందు తన్ను రక్షింప నేర్పైన·వత్తు
రేమొ యని చూచి చూచి యల్లే నిలబడి
అతనిప్రాణాలు కనుగూళ్లయందు నిలిచి
మరలఁ గనేఁగాక నేటిజన్మమున నతని.

అతనిపాడినయంతసే పల్ల - నట్టి
యతనికన్నులు చూచినయప్పు డెల్ల,
నూతిలో మున్గునాతని తీతు నంచు
వేగిరముపుట్టు నాదుహృద్వ్యథయందు;

అంతలో పాట నాపి, తా నచట నచట
కాను లడిగి, కూతురు ముందుగా వినిర్గ
మించు నాతడు -
నే నందు మిగిలిపోదు !

విశ్వనాథ

ఒ క టే క థ

వెదకి వేసారి నా వెఱ్ఱిబ్రతు కెపుడేని
తుదిరేయి కనుమూయునా,
బేలనై
నిదురబరువులఁ గ్రుంగునా,
మరపుమనకలదారి తెరచికొని కల యేదో
విరిసికొని పరతెంచును,
కాఱు రా
తిరికొనల మెఱపించును !

కలఁగి తొట్రిలుచు నాకలితొందరల సోలు
కరము లట్టే చాతునో,
నామందు
కనుల నట్టే తెరతునో,
అంతలో, నింతలో, నడుగుజాడయె లేక
వింతకల కరఁగి చనును,
నాకు నా
వంతకథయే మిగులును !

వనరు చేద్వఁగలేను, చచ్చి చావఁగలేను
కనలేని వెలుఁగుకొఱకై
ఎన్నఁడును
కనరానిదానికొఱకై !

ఒకక్రొత్తబరువుతో, ఒకక్రొత్తయానతో
ఒకఁడనే పడిపోదును,
శూన్యమున
ఒకఁడనే కృశియింతును !

కృష్ణశాస్త్రి

## ఆవృత్తి

ఆ ప్రశాంతనిశాజరఠాంతమందు
కలఁతనిద్దురలో కలల్ గాంచుచున్న
గౌతమీనది నా మనోగతవిషాద
తమము నంతయు తనలోన దాచుకొనియె;

ఆ నదీసైకతముల నాయదుగుజాడ
చెరిపివేయగ వెనువెంట నరుగుదెంచు
గాలితరగల చల్లనికడుపులోన
కన్నుమూసెను నా యూర్పుగాడ్పులెల్ల ;

చెడ్డదో మంచిదో మహాసృష్టియందు
జరుగు విషయంబులను దటస్థముగ నాయ
నంతగగనమునందుండి యరయుచుండు
తారలె, మనశ్రుకణముల నేరుకొనియె;

నేనె మిగిలితి నీగౌతమీనదీ ప
విత్రగర్భంబులో ప్రోతవెట్టుచున్న
యుగయుగాంతరవిశ్వమహోగ్ర దుఃఖ
జీవగీతాల కావృత్తి చెప్పుకొనగ!

శేదు ●

## ప్రవాసము

ఎన్ని యెన్ని నిశ్వాసము లెగసినవియో
ఈబ్రతుకె రూపుమాసిపోయినది గాని,
ఇంతవిశ్వమ్ములో జాలి నింతనీడ
ఒదవగాలేద యొక్క నిట్టూరుపునకు!

కంట గురిసిన కార్చిచ్చుమంటయేళ్ళ
కాలి నుసియై నశించె వాంఛా లవాలె,
ఏ కెరుంగుదురని ఏ యెడారిదార్ల
నింకెనో చుక్కతడి జాడ యేని లేక!

కరుణపట్టున కే బిచ్చగానిచేయి
చాచికొనినాడ మృత్యుఘోషమ్మె మరచి,
వట్టిబయలున నొక మోడుచెట్టువోలె
ఎత్తినది కర మెత్తినట్లే కృశించె!

కనులు రెండును బండిచక్రమ్ములయ్యె
చనవుచూపున కెరుకనవ్వునకు వెదకి,
ఎందులకొ వెర్రిమదివోలె నిపుడు తిరుగు
చూపులే లేక అజ్ఞాతశూన్యసీమ!

స్వాగతాశ్లేషమున విడజాలు నెదల
నల్ల ద్రావితి మున్ను దోసిళ్లకొలది,
వలపుటాకలి స్రుక్కు నా బ్రతుకుమీద
ఇనుపపాదాల నిడి లోక మిపుడు నడుచు!

ఆశయమ్ముల, ఆనందలేశముల, అ
లంతియాసల, జీవితమంత ఇట్లె
యేడ్చివైచితి, నినువారె యేరు లేక,
యేడ్పునందడి నాలోననే చొరంగ!

వడవడ వడంకిపోదు జీవనపుగొనల
నెన్నడే నాసకళ తలయెత్తెనేని,
ఉభయసంధ్యాంచలముల నెదో వెలుంగు
కలుగ కలవరపోవు ఘూకమ్మువోలె!

మింట వెలుగు చుక్క గన్న, మిణుగు రన్న
నేను సహియింపలే, నవ్వి యిరులు చెరుచు;
నాకు ప్రాణమే మెఱపులే లేకయున్న
భాద్రపదమాసమున నమావాస్యరాత్రి!

రేయికడుపున చీకటిచాయ వోలె,
తమసు లెడద దివాంధగీతము విధాన,
ఘూకరావాన వలవంత రేక రీతి,
నా విషాదమ్ములో దాగినాడ నేనె!

కృష్ణశాస్త్రి

ఏమొ!

పొదుగు నొవ్వంగ బాధించు ముద్దులేఁగ
నొడలు నాకెడి గోసాధ్వియో ర్పదెంతొ,
బాధ సళుపరించినఁగాని స్వాదువయిన
ప్రేమమాధుర్యము రుచింపదేమొ పుత్ర!

మాయపొరలు వీడిన సుకుమారశిశువు
నోరు దెఱచి యేడ్చెడిని యెందులకొగాని,
అంపకపుఁబెండ్లికూఁతుఁ గన్నారఁ జూచి
నిలుపలే దేమిటికిఁ దల్లి నిండుటేడ్పు!

పడకటిలుఁ జూచి యేడ్చు జవ్వని యొకర్తు
చనినదేసఁ జూచి యేడ్చు జనని యొకర్తు,
తనసొగసుఁ జూచి యేడ్చు సుందరి యొకర్తు
ఏడుపుఁ బ్రియమ్ముగా వచియింతురేమొ!

*    *    *

రాయప్రోలు

సమాలోచనము

ఇది నిశాంతతమఃక్రాంత, మిది దరిద్ర,
మీ నిశాంతమ్ము శూన్య, మిం దెన్నఁడో ర
హ శ్శిథిలసుప్తి గలవరమంది, లేచి,
గుబులుకొను, లేతనెత్తావిగుసగుస లెవో!

అంత నీ యంధమందిరమందు, నొక్క
రెప్పపాటు వేసువ, ఒక్క రెప్పపాటె,
ఉన్మిషితజీవనాగమనోత్సవమ్ము,
ఉదితగీతాప్రవేశముహూర్తవేళ!

అప్పుడే గృహనేత్రవాతాయనముల
కొలుకులందు, లే వెలుంగు తళుకు జివురు,
లరుణమసృణతోరణపంక్తు, లల్లు నేమొ,
ఆడు నేమొ, వాడిన మోము లల్లె వాల్చు!

తెరచికొన్న ద్వారము జొచ్చి, విరిసికొన్న
వాకిలిం జేరి, మంగళవాద్యపాళి
గద్గదిక వోవ సవరించి గళము, పాడు
నేమొ, నిర్జీవనిశ్శబ్ద మిట్టె మూగు!

మరల గ్రుడ్డిరాతిరి పడు, మరల నోరు
కాని శ్రుతులేని లేని చీకటులు మరల
మరల పాడిల్లు...

కృష్ణశాస్త్రి

## సుప్తాస్థికలు

అవి ధరాగర్భమున
మానవాస్థికాపరంపరలు!
సుప్త నిశ్శబ్దసంపుటములు.
అట నొకే దీర్ఘయామిని!
ఆ నిశా శ్మశానశయ్యకు
ప్రాతః ప్రసక్తి లేదు;

ఆ అగమ్యతమోరహస్యాంగణాన
తాండవించును
మృత్యుశైత్య మొకటె!

అవి నితాంత హేమంత హృదంతరంత

రనుభవాళి

ఘనీభవించిన సమాధులు !

ఆ మనుష్యాస్థికలు,

నిద్రలో మునింగి

సంచరించును భైరవస్వప్నవీథి !

అవి చలించును,

తమ చర్మకవచ మెపుడో

బ్రదికినదినాల తలపోత బరువుచేత !

నా కనుంగవ

కన్నీళులై కరంగు

అవి ఒనర్చెడు నీరవాహ్వాన మెరిగి !

ఇంత శోషిల్లు నేలొ నాహృదయపుటము,

వణుకు నేటికొ

నా అస్థిపంజరమ్ము !

శ్రీ శ్రీ

## చ లి పి డు గు

ప్రళయాంతాభీలనభో
దళన ఫెళఫెళారవముల
చలిపిడుగా! గర్జింపకు,
నిలిచి నాదుమనవి వినుము:

బంగారపుబొమ్మ నాదు
మంగళప్రదమ్మ యొంటి
రుద్రభూమి గటికనేల
నిద్రించెడు నొడలు మరచి,

చూపబోకు మచట నీ ప్ర
తాపమెల్ల పిడుగా! నా
కన్నతల్లి యడిలి లేచి
కక్కటిల్లి యేడ్వగలదు!

కడుపుమంట గనలి పొక్కు
కన్నతండ్రినైన నాదు
పలువరింతమాటలకును
నలుక బూనకయ్యా మదిని!

ప్రళయాంతాభీలనభో
దళన ఘెళఘెళారవముల
చలిపిదుగా! గర్జింపకు,
నిలిచి నాదుమనవి వినుము!

బసవరాజు

## దురదృష్టము

చూచితి మెంతో దేశము
సుఖము, శాంతి, దొరకునో యని;
మునిగితి మెన్నో నదులను
మోక్షము చేపట్టుద మని;

ఎక్కితి మెన్నో కొండల
నీశ్వరు దర్శింతా మని;
మ్రొక్కితి మెన్నో వేల్పుల
కొక్కవందు పర మిమ్మని;

నోచితి మెన్నో నోములు
కాచి బ్రోచు నని పార్వతి;
కడకు దేవిదయచేతను
కంటిమి రత్నములు రెండు;

బతుకు కలంకారములో
వాని దాచ చేతగాక
ఎచటనో పోగొట్టుకొంటె
యెంతటి దురదృష్టమునకో?

సౌదామిని

## తల్లి

తల్లి, అసహాయవై నీవు ధరణిమీద
పడితి వెప్పుడు నాయుదరంబు చీల్చి,
ప్రకృతియంతయు నూత్నశోభల వెలింగె,
ప్రాణనాథుడు నా నిజప్రాణ మయ్యె!

ఎప్పు డేడ్చితి వీవు నోరెత్తి, యెడద
తత్క్షణంబ కృపాక్షీరధార లుబికె,
చిన్నిన వ్వొప్పు నీమూర్తి చిందులాడి
హృదయము కలంచె, ఎరిగితి ప్రేమబాధ!

చిగురుటాకు పెదవుల ముద్దులుచిల్క, నెపుడు
'తల్లి!' యని పిల్చి నన్నీవు దరిసినావొ,
అపుడు శ్రుతమయ్యె సృష్టిరహస్యమెల్ల,
'తల్లి!' యని మారుపిల్చి నిస్తబ్ధనైతి!

ఆత్మయే గాక నాదు దేహమ్ముకూడ
కొల్లగొట్టి మాధుర్యంపుకుప్పవగుచు
తల్లి, నిశ్చింత నను వీడి తరలిపోతె,
'తల్లి!' యను నాదుఆర్తనాదమె మిగిల్చి !

శా ౧

## మాతృగీతములు

ఎవ్వఁ డాక్రూరకర్ముఁ డెవఁడు, నీల
జలదనిర్ముక్తశైశిరశర్వరీప్ర
శాంత మలవాటుపడిన నిశాంతమందు
అకట, నట్టింటిదీపమ్ము నార్పినాడు !

ఎవ్వఁ డానిరసాత్మకుం డెవఁడు, సాంధ్య
రాగమంజులరేఖావిరాజమాన
మంగళాకాశసీమంతరంగమందు
కాఱుఁజీఁకట్లరాసులు గ్రక్కినాఁడు !

ఎవ్వఁ డానిర్దయాస్వాంతుఁ డెవఁడు, నన్నుఁ
గంటకనిగూఢవిపినమార్గములఁ, దల్లి
లేనిబిడ్డను గావించి, మానసంపు
టాసలన్నియు నడుగంటఁ గోసినాఁడు!

౨

నేను జడబుద్ధినై నుంత నీదు పూజ
కై వలయు వస్తువుల్ సమాయత్తపఱుప
మఱచితినయన్ను, నా కిట్టి మఱువరాని
శిక్ష ఘటియింప నీ కెట్లు చేతులాడె?

ఎంతకాలమ్ము పట్టినదే? త్వదీయ
పూజకై ద్రవ్యసంతతుల్ ప్రోఁగుసేయు
టింకను సమాప్తి లేదు తల్లీ! యిఁకొక్క
వత్సరమ్మైన నీ వోర్పుఁబట్టలేదు!

ఇంక నాజీవితమ్ము నీ స్మృతికిఁ జిక్క
బడిన యొకశాసనమ్మయి వరలు నటవె!
చిన్ని నీ విగ్రహము ప్రతిష్ఠితము నాదు
నంతరంగమ్ము నీకు దేవాలయమ్ము!

## 3

నీవుఁ మడిగట్టుకొనిపోయినావుఁ పండ్లు
పుష్పములు బట్టుకొని దేవపూజ కేటకో;
నేను నీకొంగుఁ బట్టుక నీదు వెంటఁ
బోవుటకు లేక కన్నీటిబొట్లు రాల్తు!

నీవు పోయిన దెచటనో దేవళంబు,
లలితపూజావిధానసంలగ్నహృదయ,
వావినిశ్చలధ్యానసమాధియందు
మఱచిపోదువో యేమొ నామాటఁ దల్లి!

నేను నీ కన్నబిడ్డను, నిశితమైన
నా కడుపుమంటఁ జల్లార్పు, లోకనాథ
పాదకంజమరందమ్ముచేఁదు కడుగు
ప్రత్యహమ్మును నీ చనుఁబా లొసంగి!

నాయని

## పుష్య పూర్ణిమ

పున్నమ యేగుదెంచె, పరిపూర్ణసుధాకరబింబ
మల్లదే చెన్నలరారెడిన్ గగనసీమను,
చల్లనిపండువెన్నెలల్ కన్నులపండువై కడల
గ్రమ్మె, సమస్తము మోదభోగ్యమైయున్నది
కాని, నాహృదయ మొక్కటె క్రాగెడి
దుఃఖవహ్నికిన్ !

హ్లాద మొసంగుగాదె యఖిలావనికిం గడు
జ్యోత్స్న, యందులో మోదము మీరగా
భువనమోహనమై తనరారు పూర్ణిమన్ !
నా దురదృష్టభారమున నైజమె పో
తలక్రిందులౌటచే ఖేదము మేదురం బగుచు
కేవలమున్ హృదయంబు నేర్చెడిన్ !

పుట్టిన దామె యో విమలపూర్ణిమ,
నీ హృదయంబునందు ! చేపట్టిన దస్మదీయ
మృదుపాణిని, మత్కరపల్లవంబునం దిట్టె
గతించిపోయె హృదయేశ్వరిదివ్యవయోవిలాస,
మిప్పట్టున ఘోరమై మిగిలె ప్రాణవిశోషక
దుఃఖకీలియే !

ఆయమ యెట్టిదో యెఱుఁగ వక్కట!
రొక్క నిమేషమేనియుం బాయక నన్ను
ఛాయవలె, బాహుయుగమ్ము సమాశ్రయింపదే!
నీ యుదరంబునందున జనించిన దానిని
నీ కుమారికన్ న్యాయమె వీడి నీ విటులు
నాకు గనంబడ పుష్యపూర్ణిమా!

ఎంతయు సంతసించు హృదయేశ్వరి
పున్నమరాత్రులందు, మత్కాంతి విలాససంపద
నఖండితమై తనరారుచుండు నాస్వాంతము,
చూచుచుండగనె స్వప్నవిధంబున
మారిపోయెనే యంతయు భాగ్యదేవికుపి
తారుణ దారుణ వీక్షణంబునన్!

వచ్చుచునుండు ముందు
ననివార్యవిధంబున పూర్ణిమానిశల్,
ముచ్చటమీర లోకము ప్రమోదమునొందు
యథావిధంబుగన్, అచ్చపుమోదసారమగు
నామె గతించుటచేత చంద్రికల్ చిచ్చులమాడ్కి
నాహృదయసీమ దహించుచునుండునే కదా!

శివశంకరశాస్త్రి

## ప్రేమయాత్ర

కమలినీప్రేమభిక్షాటనమున కపుడె
ప్రాకివచ్చుచునుండె దివాకరుండు;
హృదయమునవెల్గు ప్రేమచిహ్నితసహస్ర
భావభానువు లలము నాశావధులను!

యుగయుగమ్ములుగా తమ మ్మొదిగి యొదిగి
తిగ్మరోచిస్సహస్రమూర్తిని గమించు,
వాని భేదింప దశదిశావళులు దాటి
తనయనంతమహాజ్యోతి ధారవోయు!

కమలినీప్రేమబంధము విదిర్చి
మఱలమఱల తమోంధబంధురపిశాచ
నృత్యములు, కాలజీమూతనిబిడమృత్యు
హాసములు, ఘోరలోకలోకాంచలములు...

యుగయుగమ్ములుగా తమ మ్మొదిగి యొదిగి
తిగ్మరోచిస్సహస్రమూర్తిని గమించు...
వాని భేదింప దశదిశావళుల దాటి
తనయనంతమహాజ్యోతి ధారవోయు!

పెనుమర్తి

## అశాంతి

కనికరము లేని దుఃఖవేదనల సెగలఁ
పొగల వెలిజిమ్ము వలపుటూర్పుఁ భరమ్ము
మోసికొని నేనె నాలోన మూల్గుకొనుచు
గాలివోలె సమస్తావకాశములను
నెడ తెఱపిలేక తిరుగాడి బడలినాను;

దారుణపుజీవితంపు టెడారిలోన
తీరనిపిపాస నేదారి తెన్ను లేక
నేనె నా దుఃఖబాష్పశోణితలహరుల
నేవిసుగువేసటలు లేక త్రావినాను;

కడుపు గాల్చెడు మండుటాకటను రేగి,
కోర్కె లొండింటిని గ్రసించుకొనెడుకోలఁది
ఒడ లెరుంగక కాలమృత్యువును నేనె
కొంచెముగ కొంచెముగ కబళించినాను;

కాని, మ్రోడైన నా యెదలోని బరువు
దీర, నా బ్రతు కూపిరి దేరుకొనగ,
కనికరపుచూపు, చిఱునవ్వుతునుకయైన,
కటికికఱవయ్యె, పాడులోకాన నాకు;

ఏకడల మిన్నుమను చుక్కయేని లేని
యీనభము క్రుంగి కూలిపోయెడివిధాన
కారుమబ్బులె కాదు, చీకటులెగాదు,
క్రమ్ముకొననిమ్ము, కరడులు గట్టనిమ్ము;
వలపుతీపియెఱుంగని వట్టి రాతి
గుండెలోకమ్ము నిప్పులు గురియనిమ్ము,
హృదయ మున్నంతవరకు, నా ప్రేమకాంతు
బ్రదికియున్నంతవర, కేడ్చి, బ్రదుకుచుందు!
ఏ వెలుగు నన్ను తనదరి కీడ్చుకొనునో!
ఏ తలపు దారిసూపునో!

కే దు.

## ఉన్మత్తపథికుడు

నావలెనె యాత్ర డున్మత్తభావశాలి,
ఆగిపోలేదు రేగునూహాల నాకింత!
ఎట్టి నిశినే నదరిపోవు నెగసిపడును!
ఎన్ని చుక్కలపాటు లెన్నెన్ని మెరవులు!

ఇంత చిరుగీతి యెద వేగిరించునేని
పాడుకొనును తాండవనృత్య మాడుకొనును;
మస్తక మ్మోరగా వంచి, మన్ను మిన్ను
వేయికే లాడగా వ్రాసివేసికొనును!

ఏ నెరుంగుదు, నావలెనే యతండు
పాటపదములకై నిత్యపథికు డయ్యె;
ఏ నెరుంగుదు, నావలెనే యతండు
ప్రతిపదమ్మున శీతలస్వాదుమధుతు
షారముల పార్శ్వముల విరజల్లు చేగు!

కృష్ణశాస్త్రి

## స్వామి!

స్వామి! పరిగాఢశర్వరీచ్ఛవి, దరిద్ర
తానిధానము, తేజోవిహీన, మనవ
రతపరిస్రుతబాష్పధారామిలితము,
నన్ను నీ వుందుమున్నంగణంబు తండ్రి!

ఈమహాంధకారంబున నెపుడో యొక్క
సారి మెరసితి, వానాడు సామి! నా కు
టీర మానందవాయుప్రచారశతస
హాస్రకుసుమపరీమళవ్యావృతంబు!

దానితో సరి, మరల నాంధ్యమ్ము క్రమ్మె,
తొలి చివర లేని యీచీకటులును, నేను,
ఒక్కరొకర దప్పళించుకొంచుండినాము,
నిన్ను, నీ నాటిమెఱుపు మన్నించుకొంచు!

విశ్వనాథ

## ఆ శా గా న ము

ఏసడి లేక యీప్రకృతియెల్ల
గభీరనిశానిబద్ధమై నీసుకుమారహస్తముల
నిద్దురవోయెడు మౌనవేళ, నీవే సరిజేసి
యీశిథిలవీణను పాడుమటంచునాపయిన్
ద్రోసెదవేల, తీగ తెగునో, శ్రుతి దప్పునో,
పల్కదో, ప్రభూ !

మావులగుంపులందు, మధుమాసములన్
వికసించు కోకిలారావము పోలె,
రాగమధురమ్ముగ వీణ నదింపఁ జాల;
నన్ బోవగనిమ్ము, ప్రేమరసపూరితవిశ్వవిలీనగాన
మీవే వినిపింతువేని సుఖియించెద నే
నది యాలకించుచున్ !

ఏవిధినైన పాడుమనియే వచియింతువయేని
ప్రేమమై నీవె రచించి నాకు గరుణించిన
వీప్రణయార్ద్రగీతికల్ గావున,
నావిశుష్కితగళమ్మున నీ కరుణారసామృత
శ్రీవిభవమ్ము నింపి మధురింపుము
నే శ్రుతిగల్పి పాడెదన్ !

**వే దు ల**

న ట రా జ!

అవధరింతువు ప్రతిదివసాంతమందు
నిత్యనూతన తాండవనృత్యకేళి,
ఓయి నటరాజ, తలలైన నూవలేక
భువనములు దుర్భరానందమున నడంగ!

అప్పు డూహాంచలమ్ముల నతిశయించి
పొరలు నమృతరసంపుమాధురులలోన
గొట్టికొనిపోవు, స్వామి, నా క్షుద్రజీవి
తమ్ముగూడ, దారియె లేక, తనివిపోక!

అంత నే వెర్రినైపోదునయ్య; నిన్ను
బోలి పాడబోవుదు; నిన్నుబోలి నాట్య
మాడబోవుదు, లజ్జ బోనాడి; కాక
యింతదాహమ్ము దహియింప నెటులు మనుదు?

ఏవిధాన సౌందర్యరసైకజీవి
నిలువనేరుతు నిట నొక్కనిముసమేని,
మామకీనజీవితశూన్యమార్గముల త్వ
దీయపాదమంజీరముల్ మ్రోయకున్న!

ఆటతో పాటతో నేర్చినట్లు దేవ
ఏనుకూడ నీవలె నటియింపనిమ్ము
ఎడతెగనియీయాత్ర నెట్లొ సాగించువరకు!
ఎట్లొ నీ దర్శనమ్ము సాధించువరకు!

కృష్ణశాస్త్రి

ఉత్కంఠ

అనుపమ ప్రణయాతిథేయమ్ముతోడ
పారదెరచితి హృదయకవాట మిపుడె,
నీ గృహమె నీవె కైసేయ నేగుదెమ్ము,
మొయిలు చీకట్లు క్రమ్మకమున్నె నాథ!

వలపులోలికెడుపూవులు వాడిపోయె,
కనకపీఠిక హారతి కునుకుచుండె,
తమ్మిరేకులసురటిపొంకమ్ము తొరగె,
ఒంటి నిక నెంతనే పిటులోర్తు స్వామి?

ఏమిదోషంబు దలచిన న్నీ వియోగ
శోకమున ముంచి బాధింపజూచె దీవు?
చెప్పరాదొకొ; ఇటకు రా నొప్పవేని
వెదకికొనివత్తు నేనె నీ పదము జేర!

కలసి త్రోత్రోపులాడెడు కారుమొయిలు
రాయిడి మునింగి, భీకరమాయె రేయి,
దివ్యతేజస్వి, నీ వరు దేరకునికి !
అనదనై పడియుంటి శూన్యాలయమున !

వే దు ల

## ఏ కాం త సే వ

రజనీముఖంబున రాగంబు మెఱసెఁ
గలువపుట్టింటిలోఁ గలకల విరిసె
దివ్యసౌధంబులో దీపాలు వెలిగె
గర్భాలయంబులో గంటలు మ్రోగెఁ
బ్రాకృతీమణి పట్టె బంగారుగొడుగు
విశ్వసుందరి వీచె విరిచామరంబు
భవదఖండానందభవనాంగణమునఁ
బడిగాపు బడియుండెఁ బ్రకృతిగణంబు
ఆఁకలైన నెఱుంగవైతి వేమయ్య !
ఆరగింపఁగ వేళయయ్యె రావయ్య !

౨

విరిదండ మెడలోన వేయుటేకాని
కన్నార నీమూర్తిఁ గాంచనేలేదు,
ప్రణమిల్లి యడుగులఁ బడుటయేకాని
చేతులారఁగ సేవఁ జేయనేలేదు,

నినుఁ గాంచి ముగ్ధనై నిల్చుటేకాని
ప్రేమదీరఁగఁ బల్కరింపనేలేదు,
ఏమేమొ మనసులో నెంచుటేకాని
తిన్నగా నాకోర్కిఁ దెలుపనేలేదు,

బోధంబులో సుప్తి పొడచూపఁబోలు
కనులలోఁ జూపులోఁ గావిరుల్ గ్రమ్మె,
శుభ్రాభ్రపదములో సుడి బుట్టఁబోలు
భక్తిలోఁ బూజలో భ్రాంతులు పొడమె,

నాదంబులోఁ గంపనము బుట్టఁబోలు
తలఁపులోఁ బలుకులోఁ దడబాటు గదిరె,
వెలుఁగులోఁ జీఁకటి విరిసెఁ గాఁబోలు
మనసులోఁ దెలివిలోఁ మఱపులు దోఁచె,

ఆనంద మందులేఁ యపచార మనుచు
నవశనై యుందులేఁ యపరాధ మనుచు
మది నెంచి యీరీతి మాయలు సేయ
భావ్యమై తోఁచెనే ప్రాణేశ నీకు!

వెంకటపార్వతీశ్వరులు

ము క్తా వ ళి

పూవులరోజులున్ గడచిపోయె
విషాదహిమావృతాంధకారావిలమయ్యె
నీప్రకృతి యంతయు, ఆకులపాటు నొంది
పూదీవెలు నాదులేయెడదతీరున ప్రోడయిపోయె,
నాటియాజ్ఞావిధి స్వామి, నాకిపుడు జ్ఞప్తికివచ్చి
భయమ్ము గొల్పెడిన్!

ఈమధుమాసశోభ గతియింపకపూర్వమె
పూలతోటలో కోమలపుష్పముల్ వెదకి కోసి
యమర్చిన ప్రేమదామమున్ నా మెడలోన
వేయుమనినా, వవుడొక్క నుమమ్మునైన
నా స్వామి, భవత్పదార్పణము సల్పగలేనయితిన్
విమూఢతన్!

నావలె శుష్కజీవనమునన్ దురపిల్లెదు
ఈపవిత్ర గోదావరి పేదవడ్డ విసదమ్ములతో
శ్రుతి గల్పి ప్రేమరాగావహదుఃఖగీతు లివు
డల్లుచు గ్రుచ్చుచునుంటి నొక్క ముక్తావళినిన్
పవిత్ర నయనాంబుకణోజ్జ్వల
మౌక్తికమ్ములన్ !

ఈ సుకుమారమాల ధరియింపుము

నీ హృదయమ్మునందె స్వామీ! సుముఖమ్ములై
పరిణమించు పవిత్ర వసంతమానసంధ్యా
నమయాంతరమ్ముల రవంతి భవన్మధురార్ద్ర
దీర్ఘనిశ్వాసపరీమళానిలపు స్పర్శను
ప్రేమ ననుగ్రహించుచున్ !

వేదుల

మనవి

చుక్కలుతిరిగే హిమాద్రిపై ఆ
వాసముచేసే గౌరీశా!
విన్నావయ్యా నా మన వొక్కటి,
విన్నవించనా గౌరీశా!

త్వచ్ఛిరగంగాళీకరసేచిత
పుణ్యభూమిలో పుట్టాను,
త్వత్పాదారుణకమలమరందము
తనివితీరగా తాగాను!

సృష్టిమరుగునా తళుకు తళుక్కున
మెరిసేకాంతులు చూస్తుంటి;
కాలము దాటి, దిక్కులు దాటి,
కదిలే తేజము కనుగొంటి!

కళ్లు తెరవగా కానవచ్చినవి
కాలు సేతులకు సంకెళ్లు,
మాటలాడుటకు పెదవి విప్పగా
తాళము పడ్డది నా నోరు!

నీ పాదాలకు నిత్యసేవ నే
నెట్లు చేతునో సెలవిమ్మా?
నీ నామాంకితదివ్యగీతములు
ఎట్లు పాడుదును సెలవిమ్మా?

యక్షులు పాడే హిమాద్రిమీద
కొలువుండే ఓ గౌరీశా!
విన్నావయ్యా నా మన, విప్పుడు
పాలించెదవా గౌరీశా?

దీ క్షి తు లు

## శివరాత్రి ప్రభ

కాలకంఠుని నాగసర్పము
కుబుస మూడ్చి పడగ బున్నంది,
రెండునాళ్లలు......
గండుమీసాలట్లు దూసింది
చెవులు మోసింది;.........
నాగసార మూదేది యెవరోయి,
రాగ మొలికించేది యెవరోయి ?
కాఱునల్లని కాళరాత్రి !

నొసట గొసరిన మూడో కన్ను
నివురులూడినకొలిమిఁ దెగడి
నెగడి ద్రిప్పింది,......
పొగలు గప్పింది;......
కష్మ రయితే యినుము కరగ,
సోమ రయితే చలిని కాగ,
ఎవరు వచ్చేరోయి ?
ఎవరు మెచ్చేరోయి ?
కాఱునల్లని కాళరాత్రి !

అర్ధభాగపుమహాంకాళీ
కర్ధమది కాలేదో ?
ఏమో ? ...... 
పునకులా గలగలలు వింటూ
కునుకు గన్నాదో ?......
నాథునీ వ ద్దనదు నాట్యము,
నాదు నీ క ద్దనదు:......
అరరే ఆడిపోతున్నాయి !

వాడి ముమ్మొనవాలు...
హుతభుక్,......
అజకపాలం,......
డొక్కు డుబడుక్ ......
నాల్గుసేతులనాడు లౌతున్నాయి !
అశ్శరభ ! శరభ !
పందెమూ వేసేది యెవరోయి ?
కుందనము గానేది యెవరోయి ?
కాటుకల్లని కాళరాత్రి !
చంద్రమకుటము,......
జటాజూటము,... ...
సాంద్రనీలపుఁజడలపావట

సురిగిపోతున్నాయి!

చక్కనీ మువ్వన్నెచ క్రము

అక్కళించినపొట్టపైని

అంటియుండీ అంటకున్నాదోయి,

'ఆకలా' అని యనే దెవరు?

'సోకులా' అని యనే దెవరు?

కాటుసల్లని కాళరాత్రి!

మోకరింపులు గావు,

అది మఱి......

బూకరింపుల నిలువు గాదు;

ఆకడకుబడు నొక్క యంజ

యీకడకుబడు నొక్క యంజ

ఏకముగ జేయుచును

నడు మొక......

రేఖగాఁ దా వంచి గొంచు

సందియం లే కెంచువా రెవరు,

చిందు అని తోతెంచువా రెవరు!

కాటుసల్లని కాళరాత్రి!

అహంకారము లేదు లోలో
మహార్ణటనము మొగము చాటదు,
మహాదేవా! యభయమిదు మన
అభినయానకు హస్తమే లేదూ!
రభనమునఁ దన ముందు వెనుకల
ప్రభల గలిపించు;
ప్రభలలో ప్రభ నిలుప నెవరోయి?
ప్రభలలో ప్రభ గలుప నెవరోయి?
కాఱునల్లని కాళరాత్రి!

కవికొండల

## వటపత్రశాయి

ఒంటిగా నుయ్యాల లూగితివా
నా ముద్దుకృష్ణా!
జంటగా నను పిల్వదగదోయీ!
కంటికంతా జలమయమ్మై
మింటివరకూ యేకరాశై

జంటదొరకని మహాప్రళయపు
టింటిలో వటపత్రడోలిక
ఒంటిగా నుయ్యాల లూగితివా
నా ముద్దుకృష్ణా!
జంటగా నను పిల్వదగదోయీ!

జగము లన్ని కాలయోనిలో
మొగము లెరగక నిదురబోవగ
నగుమొగముగల ముద్దుబాలుడ
వగుచు జోలల బాడుకొంటూ
ఒంటిగా నుయ్యాల లూగితివా
నా ముద్దుకృష్ణా!
జంటగా నను పిల్వదగదోయీ!

బ స వ రా జు

## నీ ర థ ము

ఓ ప్రభూ! నీరథమ్ము దీక్షా ప్రణీత
విధుర వేగమ్ము పరువులు వెట్టుచుండె,
నా శరీరమ్ము దాని క్రిందఁ బడి నలిగి
నలిగి పోయినయది రక్తనదము లింక,

దివ్యతేజోవిరాజత్త్వదీయరథము
ఈ గతుకు డేమి? యనియైన నాగలేదు;
నా విరోదించిన హాతాన్ని నాదమునకు
వెనుదిరిగియైన మఱి చూచుకొనగలేదు!

నాదురక్తంబు నీ రథచోదకుండు
కడిగివేయును రేపు చక్రములనుండి,
అచటి బహుజనరక్తచిహ్నములయందు
నాది యి దని గుర్తేమి కన్పడును సామి?

విశ్వనాథ

## పూజాప్రసూనములు

రాలనిపూలు కోసికొని రమ్మని పంపితి
వీవె యీాయుషఃకాలమునందు పెద్దయొడిగట్టి
ననున్; పవమానవీచికాజాలములందు నే
వలపుజాడల గట్టుచు వచ్చులోన
ఈ పూలవనమ్ముగుమ్మమును మూసిరి,
పిల్చిన పల్క రెవ్వరున్!

ఈ పథమందు వచ్చు జనులెల్ల
రెగాదిగ నన్నుజూచి లో లోపల నవ్వుచుండ
నెటులో నిలుచుంటిని వేగుచీకటిన్
మావులువడ్డ లేతపొగమంచు తెరల్ పులకించిపో
ఉమః శ్రీపవనమ్ములెక్కి విహరించెడు
పూవులతావు లానుచున్ !

ఆ రవికాంతి నీలజలదావళిపై బడ
చిత్రవర్ణశోభారమణీయతల్ దివిని వ్రాలిన పోలిక
ఈప్రభాతగంభీరసుగంధశీతలసమీరము
నామెయి సోకినంత విప్పారెను
నావిషణ్ణహృదయాన
అపూర్వవిముగ్ధభావముల్ !

వేసవిరేల వేణువనవీథులయం
దలసప్రచారముల్ చేసిన కమ్మతెమ్మెరల
చిందులలో స్ఫురియించు గానవిన్యాసమువోలె,
మెల్లమెల నాచెవి సోకెను
నీ నిరంతరవ్యాసితవిశ్వఘోషణరహస్యము
దూరమునుండి పిల్చుగన్ !

కాలము వెళ్లబుచ్చి విధికాళులపై
తలమోపుకంటె నే నేల స్వతంత్ర ధర్మము
వహింపగ రాదని తోటపెన్గడిన్ కేల స్పృశింప
వింటి నొక కేకను 'మాలికగ్రుచ్చ నెంచు
ప్రేమాలను లీవనిం జొర ననర్హులు
వారల కంద పీవువుల్!'

వేదుల

## గురజాడ అప్పారావు

వైతాళికులనే మేలుకొలిపినవాడు. మార్గదర్శి. మేధావి. ఈయన గీతాలలో గౌరవాశయాలు, నూతనస్వచ్ఛత, స్వేచ్ఛ, ప్రత్యేకత ఉన్నవి. కవిత్వమును కళగా గ్రహించకపోలేము. కాని, సంఘ సంస్కారమునకు కొంత సాధనగా ఉపయోగించినాడు. కవిత్వాన్ని, కళను, తన ఆశయాలను నచ్చచెప్పడమునకు వినియోగించినాడు. చక్కని వాడుకభాషను ప్రవేశబెట్టి, సులభశైలిని పదాలు పాడి, ముత్యాలసరము కూర్చి భాషకు శాశ్వతమైన ఉపకారము చేసినాడు. కవిత్వం పండితుల ప్రత్యేకనిధి కాకుండా అందరికీ పంచిబెట్టు మార్గాన్ని నిరూపించినాడు. ముందురాగలవారికి 'మేగ్నాకార్టా' **magnacarta** సంపాదించినాడు.

జననం 1865 మరణం 1915

కృతులు : 1 ముత్యాలసరములు-చిన్నకథ 2 నీలగిరిపాటలు
3 సుభద్రాపరిణయం [ప్రబంధం-అముద్రితం]

## రాయప్రోలు సుబ్బారావు

అన్నిట తెలుగువాడు; అభిమానములో, భావములలో ; పోడిమిలో, పోకడలలో. తీయని మెత్తని పదాలను సున్నితంగా స్రావణంతో ఏరి నాజూకుగా పొదగగల గొప్ప, నడకలలో కులుకు విన్నాణ

ములు ఒప్పించగలశక్తి, ఈయనసొమ్ము. రవీంద్రుని సాన్నిధ్యమూ, వైష్ణవగీతాలలోని రక్తిమా ఈయనకు ఒకవింత సంస్కారాన్ని కూర్చినవి. 1913 నాటి ఆంధ్రోద్యమము ఈయన దృష్టికి ఆంధ్రతేజస్సును సాక్షాత్కరింపించినది. ఒకనాటి ఆంధ్రౌన్నత్యమును అపూర్వకవితా దృష్టితో చూడగలిగినాడు; ఆనాటి మహాత్కార్యాలకు తనజాతిని పురికొల్ప తన కవిత్వాన్ని, కళనూ, ఆవేశాన్ని ఉపయోగించి నెల్లూరిసభలో దేశీయుల హృదయాలను కలచి, భక్తితో, బాధతో, ఆందోళనతో కారుతూఉన్న కన్నీటిజాలువెలుగులో పూర్వపు టాంధ్రౌన్నత్యమునూ, భావిశోభనూ, దర్శింపించగలిగినాడు.

జననం 1892

కృతులు : 1 కవితాంజలి [తృణకంకణము, స్నేహలతాదేవి, స్వప్నకుమారము గల సంపుటి] 2 జడకుచ్చులు
3 మధుశాల, [ఉమార్ ఖయ్యాం అనువాదం]

## బసవరాజు అప్పారావు

నగ్నంగా, నిజంగా ఉంటుంది ఈయనకవిత్వం. జిలుగూ తళుకూ ఉండదు. ఉండడానికి వీలులేదు. ప్రతిభావమూ గుండెచీల్చుకుని దూకుడుగా వొస్తుంది. అందుచేతనే ఈయనపాటలలో తొలిచరణాలే గుండెపట్టుకుంటవి. అనుభవాలే పాడుకుంటాడు, తనకోసమే ముఖ్యంగా అనిపిస్తుంది. జీవితంలో ఏదెబ్బతగిలినా, ఏసుఖంకలిగినా వెంటనే కవిగా పలుకుతాడు. మహోచురుకైన హృదయం. భక్తి

గురజాడ అప్పారావు గారిది. కాని, కవిత్వం పూర్తిగా కళగా ఎంచుతాడు.

జననం 1894 మరణం 1933

కృతి : బసవరాజు అప్పారావు గీతములు

## సౌదామిని

[బసవరాజు రాజ్యలక్ష్మమ్మ]

కడుసున్నితము, మహాగభీరము; ఈ యమపలుకు, హృదయము. గుండెలువణికే విశ్వమంత ప్రేమా, ఆ గాంభీర్యాన్నంతా అణచుకుని ఓర్చి ఎదురుచూసే మహత్తరశక్తి, ఈమె గీతాలలో పొంచి కనిపించుతవి. నిరాడంబరమునకు స్వచ్ఛతకు ఈమె గీతాలు గొప్పవి. ఒక్కొక్క గీతం ఒక్కొక్క హృదయస్పందనం.

జననం 1904

## అబ్బూరి రామకృష్ణారావు

పదగుంభనలో 'కీట్స్' కవి వంటివాడు. కవిత్వంమొత్తంలో గొప్ప 'హుందా' గోచరిస్తుంది. ఉత్తమసంస్కృతకావ్యాలలోని పూర్ణతా, గౌరవమూ, లావణ్యమూ ఈయనపద్యాలలో ప్రతిబింబిస్తవి. నన్నయనాటి అక్కరలకు మార్పులు తెచ్చి కొత్తనడకలు నడిపించడమే కాకుండా, స్వకపోలకల్పితాలైన నూతన చందస్సులుకూడా

కల్పించాడు. ఈయన పద్యాలలో ఒక్కపలుకుపట్టిచూసినా ఉత్తమ సంస్కారి అని తెలుస్తుంది.

జననం 1896

కృతులు : 1 ఊహాగానము - అపూర్వప్రేమ 2 మల్లికాంబ 3 నదీసుందరి

## వెంకటపార్వతీశ్వరులు

వీరు ఒకవిధంగా యుగసంధిలోనివారు. భక్తిపట్టున మహాపరవశులు. వీరివాణి కొండయేరువలె మంజుగానంతో అతిత్వరితంగా ప్రవహిస్తుంది. వైష్ణవగీతాలలోని ప్రేమోన్మాదం వీరి భావోద్రేకాన్ని ఎక్కువగా రగిల్చినది. భాషపూర్పులో, పలుకు విధానంలో నూతనత్వాన్ని కల్పించినారు.

ఓలేటి పార్వతీశం - జననం 1882

బాలాంత్రపు వెంకటరావు - జననం 1881

కృతులు : 1 కావ్యకుసుమావళి ౧-౨ 2 ఏకాంతసేవ 3 రత్నహారము

## దువ్వూరి రామిరెడ్డి

స్వచ్ఛంద ఆశయాలు, స్వేచ్ఛానురక్తి, నిర్మలజాతీయత ఈయనకు ఆవేశాన్ని ఇచ్చేవి. ఆంగ్లఫారసీవాఙ్మయాల మంచిపలుకుబడి గ్రహించినవాడు. నూతనభావాలనుసహితం తెలుగు జాతీయతను

అనుసరించి నిర్దుష్టముగా స్పష్టముగా పలికినాడు. పూర్వపద్ధతుల మీదను అభిమానము మెండయినా, అభిసారికవంటి కొత్తపోకడలు కల్పించినాడు. ఈయన కరకుకవి. నగరవిజ్ఞానము చవిజూచినా జీవితము పొలముగట్టునకే మరలించినాడు. వాల్మీకి కళాసంపత్తిని అనుభవించగలడు, గరికపోచ కదలికతో హృదయం శ్రుతి కలిపి విశ్వవ్యాప్తజీవితరహస్యం గ్రహించగలడు.

జననం 1895

కృతులు : 1 కృషీవలుడు 2 జలదాంగన 3 నలజారమ్మ అగ్నిప్రవేశము 4 నక్షత్రమాల 5 నైవేద్యము 6 వనకుమారి 7 పానశాల

## తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి

పండితుడు, వ్యుత్పన్నుడు, హృదయంగలవాడు. ప్రేమించినాడు, బాధపడినాడు. జీవించినవాడు. పూర్వపుసంస్కారమంతా బలాన్ని కూర్చుతూఉండగా రాదగిన నూతనత్వాన్ని ఆహ్వానించినాడు. నూతనపంథాతొక్కిన కవులలో చాలమందికి బలమూ 'హుషారు' నిచ్చి నూతనకవిత్వయుగస్థాపన చేసినాడు. ఈనాటి ఇతరకవులవలె ఒకప్రియురాలికి ఒకగీతం కాకుండా ప్రేమించిన హృదయేశ్వరిపై ఒక నిండుకావ్యం అల్లుకొన్నాడు. ఈయనవాణి పాతపోకడలతో నూతనఅలంకారాలకు పొందికకుదిర్చి గంభీరంగా కనిపిస్తుంది.

జననం 1892

కృతులు : 1 హృదయేశ్వరి 2 ఆవేదన

## విశ్వనాథ సత్యనారాయణ

పండితుడు, కవి; పద్యాలలో ఎన్నిపోకడలైనా పోగల శక్తిమంతుడు. ఏవిషయాన్నైనా కవిత్వదృష్టితో చూడగల కళాశీలి. ఈయనరచనలో ఎక్కువగా కనబడేవి బలమూ, జీవమూ. రాయప్రోలు సుబ్బారావుగారినివలె ఈయననూ ఆంధ్రాభిమానము పూనించినది. నేడు పాడుపడిఉన్న వేగి, ముఖలింగము వంటి క్షేత్రాలు కాలాన్ని దాటి ప్రసరించే ఈయనచూపునకు ఎదురువచ్చి ఒకనాటి తమశోభతో దర్శనమిచ్చి ఆవేశపూరితుణ్ణి చేసినవి. ఈయన ఆంధ్రుడు, ఆంధ్రత్వంలో మహాగర్వి. కవిత్వపోకడలలో, ప్రాచీనప్రయోగాలలో గడసరి.

జననం 1893

కృతులు, 1 ఆంధ్రప్రశస్తి 2 కిన్నెరసానిపాటలు - కోకిలమ్మపెళ్ళి 3 గిరికుమారుని ప్రేమగీతాలు [అముద్రితం]

## చింతా దీక్షితులు

ఎంత ఆకాశపథాన్ని విహరించే భావాన్ని అయినా భూమికి దింపి సంఘానికి వెలుగుదారి చూపేటట్లు కవిత్వపథానికి పట్టించుతాడు. శిష్టవ్యావహారికము క్రమంగా హుందాగా వాడినాడు. పద్యాలలోకూడా దానికి గౌరవాన్ని సంపాదించినాడు. గురజాడ అప్పారావుగారిని, వారి ఆశయాలనూ అభిమానంతో చూసుకునేవాడు. భాషగౌరవాన్ని బట్టి, ఉత్తమ ఆదర్శాలను బట్టీ ఈయనను పోల్చుకోవచ్చును. కథకచక్రవర్తి ఈయన.

జననం : 1891

కృతులు : 1 ఏకాదశి [కథలు] 2 శబరి [నాటకం]

## నోరి నరసింహశాస్త్రి

చిన్నవయస్సులోనే ఆశులుకొల్పి పలికినవాడు. ఆంగ్లకవుల పద్ధతులను అనేకవిషయాలు గీతాలు చేసుకున్నాడు. చురుకైన మెదడు. కళ మెలకువల నెరిగినవాడు. ఆశులుకొల్పి నెరవేర్చక వదలినాడు. సోమనాథవిజయం, క్షేమాభిక్షునివంటినాటకాలు ఈయన కళాకౌశలాన్ని ప్రకటిస్తవి.

జననం 1900

కృతులు : 1 గీతమాలిక 2 భాగవతావతరణము [పద్యనాటిక] 3 సోమనాథవిజయం [నాటకం]

## కొడవటిగంటి వెంకటసుబ్బయ్య

సాహితీసమితి తొలిరోజులలోనివాడు. ఆరోజులలో ఈయన కవిత్వానికి చాలా పలుకుబడి ఉండేది. ఈయనపద్యాలలో మృదుత్వమూ, హాయీ ఉన్నవి. ఈయన 'భిక్షువు' 'సెలయేరు' ఎప్పటికీ రుచించేవే. ఆధ్యాత్మికమైన అన్వేషణకై కుటుంబాన్ని మిత్రులను విడిచి ఏహిమాలయాలకో వెళ్లిపోయాడు. కవిత్వంకన్నా ఎక్కువైన దానినీ, కుటుంబంకన్నా మిత్రులకన్నా చేరువైనదానినీ దేనిని సాధించాడో, ఈనాటికీ అజ్ఞాతంగానే ఉన్నాడు.

జననం 1897

కృతి: సంధ్యారాగము

## నాయని సుబ్బారావు

పద్యాలు జీవితాన్ని చీల్చుకుని వస్తవి. అందుచేతనే అంతబాధ కరంగా ఉంటవి. గుండెలకు తగిలేటట్టు చెబుతాడు, యత్నం లేకుండా. పద్యనిర్మాణమునకు పాటుబడినట్టు కనిపించదు. అదే ఈయనకళ, గొప్పది. కవిత్వం ఈయనను వరించినది - వలపులో, విరహంలో, వేదనలో, మాతృప్రేమలో. ఈయనకవిత్వానికి హృదయం గీటురాయి. ప్రియురాలిఎడబాటు పిచ్చివానిని చేసినది, తల్లి మరణం ఘోరమనిపించినది. ఆనందంలో స్వర్గవీథులలో విహారం చేయించుతాడు. బాధలో హృదయం చీల్చుతాడు. బ్రతుకులో కవిత్వం ఏరుకుంటాడు. ప్రతిపాదం జీవించే పలుకుతాడు. ఈయన గీతాలు ఉజ్జ్వలములూ, ఉన్నతములూ.

జననం 1899

కృతులు : 1 సౌభద్రునిప్రణయయాత్ర 2 ఫలశ్రుతి 3 మాతృగీతములు

## వేదుల సత్యనారాయణశాస్త్రి

కవిత్వపులోతు తెలిసినవాడు; అనగా భావాన్ని భాషనూ ఒక్క శ్రుతికి పెనచగలవాడు. భాష లొంగినపనిముట్టు. ఎంతక్లిష్టమైనభావాన్నైనా చక్కగా చెప్పి పద్యం సుఖంగా నడిపించగలడు. వృత్తాలు నడిపించడం ఈయనసొమ్ము. జీవితం దుర్భరంగా తోచినప్పుడు ఆ కుములుతూఉన్న వేదననంతా పాడుకుని ఓదార్పుచెందినాడు. అందుచేతను 'షెల్లీ' పలికినట్టు ఈయన అతితీయని. కవిత్వం ఏ తీరని

వేదననో కలవరపెడుతుంది. ఈయన 'పూర్ణిమ', 'దీపావళి నాడు' వంటిపద్యాలు తరుచు లభించవు. హరీంద్రనాధుని అంతటి కవి 'దీపావళినాడు' వంటి పద్యానికి గర్విస్తాను అన్నాడు. ఈయన పద్యనిర్మాణంలో పూర్వులశిల్పంకూడా కొత్తవొయ్యారాలు కులుకుతుంది. ఈయన ఏభావాన్ని రేకెత్తించినా దానిలో అధునాతన తేజస్సు గోచరమవుతుంది. కాళిదాసు కావ్యాలలోని పరువమూ బరువూ ఈయన పద్యాలలో కనిపిస్తుంది.

జననం 1900

## దేవులపల్లి కృష్ణశాస్త్రి

శిల్పి, గాయకుడు - కవిత్వంలోకూడా. సన్నపోగారు చెక్కడంలో 'మ్యూరల్ డెకరేషన్'లో మహానిపుణుడు. 'కీట్స్' 'షెల్లీల' పద్ధతిని పదాల కూర్పులో నూతనసృష్టిగావించుతున్నాడు. ఇది తెనుగుకవిత్వభాషకు ఈయన ప్రత్యేకఈవి. ఊహాతీతమైన దేనికో అర్రులుచాచే ఆశాజీవి. ఆశయాలలో,అనుభవాలలో కొత్తందనము, విశేషప్రత్యేకత ఉన్నవాడు. ప్రేమకై విదాహం పొందాడు, విరహంలో వేగిపోయాడు. ఈ అనుభవాలను శాశ్వతశిల్పాలుగా నిర్మించాడు. దుఃఖించాడు ప్రేయసిమరణానికి; కాని దుఃఖం మారినది అవ్యక్త వేదనగా. చివరకు దుఃఖాన్వేషించ మొదలుపెట్టాడు. ప్రేమించాడు వ్యక్తులనేమో! కాని, ప్రేమ తెరిచిన గవాక్షాలగుండా హృదయం పరుగువారినది, వింతమిణుగురులకు, తళుకుమెరుపులకు; పీడని ఒకవేదనతో, దొరకని ఒకతేజస్సునకై. పాటలలో ఈయనను దరిజేరగలవారు లేరు. బ్రాహ్మమతం కోరిన

స్వేచ్ఛను పొందినవాడు, అంతకు ఎక్కువైనస్వేచ్ఛకై పాడినాడు. వైష్ణవగీతాలలోని హృదయపక్వత మెదడునకు పట్టించుకున్నాడు. కళాసంపత్తి ఎక్కువ. కవిత్వంకోసం బ్రతుకుతాడు. రుచిగలవాడు.

జననం 1897

కృతులు : 1 కృష్ణపక్షం 2 ప్రవాసము - ఊర్వశి 3 కన్నీరు 4 శ్రావణి 5 కార్తికి 6 మహతి [అముద్రితం]

## నండూరి సుబ్బారావు

తనకు సాక్షాత్కరించిన కవితను అందుకోవడంలో బంధాలను తెంచివేశాడు, నియమాలను తోసిపారవేశాడు, మహాసాహసంతో. ఈయనగీతాలు గుండెలలోనుంచి సూటిగా, వెచ్చగా ప్రవహిస్తవి. ఈయనసంస్కారము స్వచ్ఛమైన భూసారమునుంచి ఉత్తేజమందినది. మహోన్నతమైన హృదయంతో భావిస్తాడు. 'చూపుతో మాటాడి', 'ఊపిరితో తెనిగించే' నిపుణుడు. భావమున, భాషలో, అన్నిట సాహసంతో ఎర్రబావుటా ఎత్తినాడు. ఈతీరుగుబాటు కొందరకు 'గాలిదుమార'మైంది, కొందరకు నవయుగప్రాభాత వాయుప్రసరణమైంది.

జననం 1895

కృతి : ఎంకిపాటలు

## కవికొండల వెంకటరావు

ఆంగ్లకవిప్రపంచంలో 'వర్డ్స్‌వర్త్‌వలె' అడుగడుగున ప్రకృతి ఉపాసకుడు. ఆలుచిప్ప మొదలు శివరాత్రిప్రభవరకూ సృష్టిలో సమస్తమూ ఈయనకు ఏదోఒక క్రొత్తఊహను స్ఫురింపజేస్తవి. రచనలలోనూ, ఊహాలలోనూ వైవిధ్యము ఎక్కువ. భాష పట్టింపు లేదు; భావాన్నిబట్టి, మానవీకస్థితినిబట్టి, పద్యం ఇష్టం వచ్చినట్టు స్వతంత్రించి పరిగెడుతుంది. ఏవస్తువైనా ఈయనకు అమితఉత్సాహాన్ని, ఆవేశాన్ని కలిగిస్తుంది. ఊహాలలో మిక్కిలి ప్రత్యేకతగల వాడు. మొత్తంమీద భావమున వినూత్నత, విధానమున అతి స్వతంత్రతగల సాహసుడు.

జననం 1892

కృతులు: 1 నెలబాలుడు 2 ప్రకృతిచందనము 3 మాతృదేశసంకీర్తన 4 జనపదములు 5 విలాసినిపైన తేయము [అముద్రితం]

## అడవి బాపిరాజు

కవిత్వమేకాదు, చిత్రలేఖనమేకాదు, అభినయమేకాదు సులభంగా ఈయనకు అలవడని కళ లేదు. కళలు ఈయనను వరించినవి. అందు చేతనే ఈయనచిత్తరువులు కవిత్వభాషలో లిఖించినట్టు ఉంటవి; ఆచిత్తరువులలోనిరేకలు నాట్యవిన్యాసంతో కదలులాడుతవి. జాన పదుల జీవితాలూ, వారిపదాలూ ఈయనను కలతపెట్టి కళాపుష్టిని కలిగిస్తవి. ఉత్కృష్టఆదర్శాలు, స్వతంత్రమైన ఊహాలు.

జననం 1895

కృతి: తొలకరి

## శ్రీరంగం శ్రీనివాసరావు [ శ్రీ శ్రీ ]

ఈయన పలికేవిధానంలో, భావించేపద్ధతిలో విశేషతఉన్నది. 'స్పెన్సిరియన్' విధానం మొదలు 'సిర్రియలిజం' వరకూ ఆంగ్లకవిత్వ పోకడలను అవగాహనచేసుకున్నాడు. అందుచేతనే వింతపోకడలు పోగలడు. అందరానిభావానికే లంగరువేయడానికి ఈయన చేసే యత్నం 'ఒకరాత్రి' లో గోచరిస్తుంది. గాలిలోకదలికలకు వింత ఆకారాలను కలిపించుకుంటుంది ఈయన భావన. చురుకైనవాడు.

జననం 1910

కృతులు : 1 ప్రభవ 2 మహాప్రస్థానం [అముద్రితం]

## రామచంద్రఅప్పారావు

ఈయనపుట్టుకను అందుకున్నది బంగారుతూగుటుయ్యేల; ఈయన పసినాటి తొలిచూపులకు పులకరించినవి కాంచనఘంటికానినాదములు, ఆశ్రితుల అభిమానసేవలు. కాని, వియ్యమందినది హృదయం విశ్వవేదనతో; కన్నులు పరిచయం అలవరుచుకున్నవి కలతగను విషాదచ్ఛాయలతో. చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి అంతటి ఆయన, ఈయన పాలబుగ్గలపలికినకావ్యం 'తరణమునకు' మెచ్చుకుంటూ, 'ఈ

కాలమునన్ గవిత్వమనగాఁ, బెడత్రోవలఁద్రొక్కుచున్న గ
య్యాళికిఁ దుల్యమై చెడుట యారయుచుంటిమి, వారిత్రోవలన్
గాలిడఁబోకుమయ్య! యది గాలికి దూళికి, బోవు'

అని జాగరూకత పలికినప్పటికీ నిజమైన కవిత్వానికి అక్షరణగల రనపిపాసువు ఈయనహృదయం 'షెల్లీ' 'కీట్స్' లవైపే మరలింది.

ఈయన 'సౌందర్యోపాసన' లోని తీవ్రత ఈనాటి నూతనకవిత్వానికి కూడా నూతనం.

జననం 1909

కృతులు : 1 తరణము 2 సిరిరత్నాలు 3 వసంతగీత 4 సౌందర్యోపాసన

## పెనుమర్తి వెంకటరత్నం

దేశాభిమానం, భాషాభిమానం ఎక్కువగాగల యువకుడు. ఈయనకవితలో మెత్తన, మెలకువ, గోచరిస్తవి. పాపం, తొందరలో ముగిసిపోయింది ఈయనజీవితం. ఈకొసలో ఈయనపలికిన వాక్కులనుబట్టి గ్రహిస్తే, ఏమబ్బులమలుపులలోనో దృష్టికిఅనిన ఆశయాలకు తెరచాపనుఎత్తిన సాహసపునావికునివలె కనిపిస్తాడు. ఈయన ఆసించినయాత్రకు శరీరం కలిసిరాలేదు.

జననం 1907 - మరణం 1930

కృతులు : 1 సితసుధ 2 రత్నార్పణము [రెండూ అముద్రితాలే]

## కొడాలి ఆంజనేయులు

నాజూకుగా ఊహిస్తాడు, మెత్తనిమాటలపొందికలో జాగ్రత్తగా వ్యక్తపరుస్తాడు భావాన్ని. ఈయన 'పెండ్లికూతురు'లో కట్టిన బొమ్మలు తెలుగువారికన్నులకు చిరపరిచితాలు, అయినప్పటికీ

ఈయన చెప్పిన విధానాన్నిబట్టి ఎక్కువ రుచివంతాలు అయినవి. శైలిలో ఒక చక్కదనం ఈయన ప్రత్యేకత.

జననం 1898

## చావలి బంగారమ్మ

తెనుగుపుట్టింటి నుడికారము ఈమె గీతాలలోని ప్రత్యేక కమ్మదనము. సంస్కృత ఇంగ్లీషు కోటరికముల ఊపిరాడని తెనుగునకు ఈయమ పలుకురాక అలనాటి తీయని తెనుగుప్రాణవాయువు కాగలదు. తెనుగుకడుపువపుట్టి చేవదేరిన నుడికారము ఈమె భాష పోకడలలోనూ, తాటాకుబొమ్మలకు ప్రాణముపోసి కన్నబిడ్డనుగా చంకను ఎత్తగలిగిన పసినాటి తెలుగుభావన ఈమె ఊహావీధిలోనూ... ఊహాప్రపంచాన ఎంతగారడీ ఉన్నదో ఆనందించవలెనంటే 'ఆకొండ' లోని చోద్యమునుబట్టి గ్రహించవచ్చును. పుట్టుకతోనే కవిత్వము, పాండిత్యప్రశక్తతో దీనికి సంబంధములేదు అనుటకు ఈమె తార్కాణ.

జననం 1897

## మల్లవరపు విశ్వేశ్వరరావు

భావన చిత్రగతులను విహరిసుంది, అనుగుణంగా గీతం నడకలుకూడా. ఏ మబ్బులలోనికో ఎగరవలెనన్న ఆశ ఈయనగీతాలకు మూలం. ఏ నియమాలకూ లొంగనితనం ఈయన తిరుగుబాటు.

జననం 1904

## తల్లావ్రగడ విశ్వసుందరమ్మ

అందరానిఊహాలకు అనించే వ్యక్తి, ఈమె. అందుచేతను భావప్రపంచంసరిహద్దులదరికిమాత్రం తీసుకుపోతవి ఈమె గీతాలు. ఈవిడ ప్రతిగీతంలోనూ అవ్యక్తంగానైనా ఒకవేదన, గుండె చురుక్కుమన్న కోయిలకేకవలె ధ్వనిస్తుంది.

జననం 1900

సూచిక:


| | |
|---|---|
| అంధకారము | 204 |
| అంధభిక్షువు | 210 |
| అడవిపిల్ల | 45 |
| అడవిపూవు | 171 |
| అన్వేషణము | 128 |
| అపుడు నిల్చితి ... | 52 |
| అప్రాప్తమనోహారిణి | 76 |
| అభిసారిక | 80 |
| అయ్యారో ... | 102 |
| అశాంతి | 229 |
| ఆంధ్రపౌరుషము | 8 |
| ఆకసమున మబ్బు... | 98 |
| ఆకాలపు నాయెంకి | 106 |
| ఆకొండ | 192 |
| ఆతిథ్యము | 25 |
| ఆనాటి నావోడు | 111 |
| ఆమనినిషా | 58 |
| ఆమెకన్నులు | 57 |
| ఆమెపాట | 64 |
| ఆరాధన | 72 |

| | |
|---|---|
| ఆవృత్తి | 213 |
| ఆశ - నిరాశ | 182 |
| ఆశయము | 184 |
| ఆశాగానము | 233 |
| ఆసురకృత్యము | 86 |
| ఈ నడికిరేయి... | 99 |
| ఈశ్వరీ! | 91 |
| ఉత్కంఠ | 235 |
| ఉన్మత్తపథికుడు | 231 |
| ఊరకే చలియించు ... | 97 |
| ఎడారి | 188 |
| ఎవరు ? | 27 |
| ఎవరులేని ... | 103 |
| ఏకాంతసేవ | 236 |
| ఏనాడు ? | 81 |
| ఏమో ! | 216 |
| ఒకటే కథ | 212 |
| ఒకరాత్రి | 206 |
| ఓయీ ! | 43 |
| ఓ సఖీ ! | 50 |
| కత్తిపడవ | 121 |
| కప్పతల్లిపెళ్లి | 199 |
| కలతనిదర | 95 |
| కలలోన నారొంకి | 113 |
| కాంక్ష | 18 |

| | |
|---|---|
| కాపుపాట | 42 |
| కార్తిక పూర్ణిమ | 101 |
| కార్తికపూర్ణిమ | 202 |
| కుపితవిధి | 117 |
| కూలియన్నల కుతుకము | 135 |
| కొండతిరిగీ... | 56 |
| కోకిల | 46 |
| కోయిల | 100 |
| కోయిల | 119 |
| గంగిరెద్దు | 154 |
| గతిక | 183 |
| చలిగడగడ ... | 95 |
| చలిపిడుగు | 220 |
| చిన్ని మబ్బులు | 139 |
| చెలియా ! ... | 97 |
| చైత్రము | 198 |
| జన్మభూమి | 1 |
| జయభేరి | 167 |
| జైలులో చందమామ | 196 |
| తమస్సు | 205 |
| తల్లి | 222 |
| తాజ్ మహల్ | 88 |
| తిక్కనసోమయాజి | 165 |
| ద్రాక్షావీథి | 186 |
| దీపం | 66 |

దీపావళివాడు 207
దురదృష్టము 221
దెబ్బతిన్నలేడి 181
దేశభక్తి 2
దొంగ 124
నటరాజ ! 234
నమిలిమింగిన నారొంకి 92
నాగులచవితి 149
నాటిరేయి 90
నా విరులదోట 75
నా స్థితి 190
నా హృదయవన ... 87
నిత్యక్రీడ 65
నిన్ను దలపోయుచును ... 94
నీవు నేను 185
నెమిలికన్ను 190
నేటిరేయి 122
నేను 169
నేను మాయమ్మ... 112
నైవేద్యము 11
పడవ 176
పడవ పగిలిన 104
పరాజయము 72
పల్లకి 118
పిలుపు 40

పిలుపు 85
పుష్యపూర్ణిమ 226
పూజాప్రసూనములు 246
పూర్ణిమ 77
పూలబాసలు 38
పృథివీప్రశంస 20
పెండ్లికూతురు 147
పెన్నిధి 29
ప్రణయయాత్ర 113
ప్రణయశాంతి 55
ప్రణయినీగీతం 104
ప్రతిదినము 174
ప్రతీక్ష 203
ప్రబోధము 9
ప్రవాసము 214
ప్రళయము 70
ప్రియనిరీక్షణము 89
ప్రియుడా! 44
ప్రేమకోలకు 31
ప్రేమతత్త్వము 30
ప్రేమయాత్ర 228
ప్రేయసీ! ... 108
ఫలశ్రుతి 74
బహారిష 162
బాష్ప దౌత్యము 115

| | |
|---|---|
| భవతి భిక్షాందేహి | 138 |
| భవిష్యద్దర్శనము | 22 |
| మంగళాచరణము | 145 |
| మనవి | 239 |
| మనిషి | 134 |
| మహాకవి | 158 |
| మాతల్లి | 153 |
| మాతృగీతములు | 223 |
| ముందుగతి | 59 |
| ముందుగతి | 189 |
| ముక్తావళి | 238 |
| మురళీధ్వని | 123 |
| మూగనోము | 150 |
| మైనారిటీ పెళ్ళివరోజున | 136 |
| యాత్ర | 67 |
| రంభ | 35 |
| రక్తవిహారము | 69 |
| రాధ | 61 |
| రాధ | 126 |
| రామలింగారెడ్డి | 160 |
| లీలాజీవితము | 175 |
| వటపత్రశాయి | 244 |
| వత్సలాఘాలమున ... | 115 |
| వర్షాగమము | 201 |
| వలపునిండార ... | 140 |

| | |
|---|---|
| వార్త | 137 |
| వాల్జడ | 62 |
| వాల్మీకి | 156 |
| విరహతోరణము | 109 |
| విరహవీథి | 79 |
| వేంగిక్షేత్రము | 12 |
| వ్యర్థయత్నములు | 177 |
| శివరాత్రి ప్రభ | 241 |
| శుక్రవారము | 51 |
| శ్రవణములుసోకినంత ... | 105 |
| సంచలనశీలమైన ... | 71 |
| సన్న్యాసి | 33 |
| సమాలోచనము | 217 |
| సాధుగీతి | 26 |
| సుకృ | 83 |
| సుపాంథికలు | 218 |
| స్నేహబంధము | 54 |
| స్నేహరుచి | 49 |
| స్వాగతము | 141 |
| స్వాతంత్ర్యరథము | 5 |
| స్వామి! | 232 |

గురజాడ

| | |
|---|---|
| దేశభక్తి | 2 |
| పెన్నిధి | 29 |
| మనిషి | 134 |


రాయప్రోలు

| | |
|---|---|
| జన్మభూమి | 1 |
| ప్రబోధము | 9 |
| విరహావీథి | 79 |
| పిలుపు | 85 |
| చెలియా ! | 97 |
| ఎవరులేని... | 103 |
| మంగళాచరణము | 145 |
| మా తల్లి | 153 |
| రామలింగారెడ్డి | 160 |
| ఏమొ ! | 216 |


బసవరాజు

| | |
|---|---|
| ప్రేమతత్త్వము | 30 |
| కోకిల | 46 |
| తాజ్ మహల్ | 88 |

కోయిల 100
దొంగ 124
నాగులచవితి 149
చలిపిడుగు 220
వటపత్రశాయి 244

సౌదామిని

ప్రియనిరీక్షణము 89
చలిగడగడ... 95
ఆకసమున మబ్బు... 98
ప్రణయినిగీతము 104
దురదృష్టము 221

అబ్బూరి

పృథివీప్రశంస 20
సాధుగీతి 26
కాపుపాట 42
ప్రణయశాంతి 55
అప్రాప్తమనోహారికి 76
భవతి భిక్షాం దేహి 138
తలపు నిండార... 140
తిక్కనసోమయాజి 165
ద్రాక్షావీథి 186
వర్షాగమము 201

వేంకటపార్వతీశ్వరులు

ప్రేమకొలకు 31

ఆశ - నిరాశ 182

ఏకాంతసేవ ౧ 236

ఏకాంతసేవ ౨ 237

రామిరెడ్డి

స్వాతంత్ర్యరథము 5

నైవేద్యము 11

భవిష్యద్దర్శనము 22

ఆమనినిషా 58

అభిసారిక 80

బాష్పదౌత్యము 115

వాల్మీకి 156

గణిక 183

శివశంకరశాస్త్రి

అపుడు నిల్చితి... 52

సంచలనశీలమైన... 71

నా హృదయవన... 87

అయ్యారో... 102

శ్రవణములం సోకినంత... 105

ప్రేయసీ... 108

పుష్యపూర్ణిమ 226

## విశ్వనాథ

| | |
|---|---|
| ఆంధ్రపౌరుషము | 8 |
| వేంగిక్షేత్రము | 12 |
| రంభ | 35 |
| నేను మాయమ్మ... | 112 |
| చిన్నిమబ్బులు | 139 |
| స్వాగతము | 141 |
| మూగనోము | 150 |
| నీవు - నేను | 185 |
| నా స్థితి | 190 |
| ఆంధ్రభిక్షువు | 210 |
| స్వామి | 232 |
| నీ రథము | 245 |

## దీక్షితులు

| | |
|---|---|
| వ్యర్థయత్నములు | 177 |
| నెమలికన్ను | 190 |
| మనవి | 239 |

## నోరి

| | |
|---|---|
| పరాజయము | 72 |
| మురళీధ్వని | 123 |

మైనారిటీ వెళ్లిన రోజున 136
తల్లి 222

## వెంకటసుబ్బయ్య

అతిథ్యము 25

## నాయని

శుక్రవారము 51
నిత్యక్రీడ 65
ప్రళయము 70
ఫలశ్రుతి 74
అసురకృత్యము 86
కార్తికపూర్ణిమ 101
పడవపగిలిన! 104
ప్రణయయాత్ర 113
వత్సలాఘాలమున 115
కత్తిపడవ 121
మాతృగీతములు ౧ 223
మాతృగీతములు ౨ 224
మాతృగీతములు 3 225

వేదుల


| | |
|---|---|
| శాంతి | 18 |
| రాధ | 61 |
| యాత్ర | 67 |
| ఆరాధన | 72 |
| పూర్ణిమ | 77 |
| దీపావళినాడు | 207 |
| ఆవృత్తి | 213 |
| అశాంతి | 229 |
| అశాగానము | 233 |
| ఉత్కంఠ | 235 |
| ముక్తావళి | 238 |
| పూజాప్రసూనములు | 246 |


కృష్ణశాస్త్రి


| | |
|---|---|
| ఎవరు ? | 27 |
| ఆమె కన్నులు | 57 |
| ఆమెపాట | 64 |
| నా విరులదోట | 75 |
| నాటిరేయి | 90 |
| ఊరకే చలియించు | 97 |
| ఈ నడికిరేయి | 99 |
| విరహాతోరణము | 109 |

| | |
|---|---|
| పల్లకీ! | 118 |
| నేటికేయి | 122 |
| అన్వేషణము | 128 |
| మహాకవి | 158 |
| బ్రహ్మర్షి | 162 |
| నేను | 169 |
| ఒకటే కథ | 212 |
| ప్రవాసము | 214 |
| సమాలోచనము | 217 |
| ఉన్మత్తపథికుడు | 231 |
| నటరాజ! | 234 |


నండూరి


| | |
|---|---|
| పూలబాసలు | 38 |
| కొండతిరిగీ... | 56 |
| ముందుగతి | 59 |
| దీపం | 66 |
| సుక్క | 83 |
| నమిలిమింగిననాయెంకి | 92 |
| కలతనిదర | 95 |
| ఆకాలపు నాయెంకి | 106 |
| ఆనాటి నావోడు | 111 |
| కలలోన నాయెంకి | 113 |
| కోయిల | 119 |

పడవ 176
ముందుగతి 189

కవికొండల

ఓ సఖీ! 50
నిన్నె దలపోయుచునె 94
మాలియన్నల కుతుకము 135
వార్త 137
ప్రతిదినము 174
ఆశయము 184
శివరాత్రిప్రభ 241

బాపిరాజు

పిలుపు 40
గంగిరెద్దు 154

శ్రీ శ్రీ

జయభేరి 167
ఒకరాత్రి 206
మహాప్రస్థానం 218

## రామచంద్ర అప్పారావు

ఓయీ! 43
స్నేహబంధము 54
వాజ్లడ 62
రక్తవివాహము 69
ఈశ్వరీ! 91
లీలాజీవితము 175

## పెనుమర్తి

అడవిపూవు 171
ఎడారి 188
ప్రతీక్ష 203
ప్రేమయాత్ర 228

## కొడాలి

సన్యాసి 33
అడవిపిల్ల 45
రాధ 126
పెండ్లికూతురు 147
దెబ్బతిన్న లేడి 181
జైలులో చందమామ 196

## బంగారమ్మ

ఆకొండ 192

కప్పతల్లి పెళ్లి 199

కార్తికపూర్ణిమ 202

తమస్సు 205

## విశ్వేశ్వరరావు

ఏనాడు 81

చైత్రము 198

## విశ్వసుందరమ్మ

ప్రియుడా ! 44

స్నేహారుచి 94

కుపితవిధి 117

అంధకారము 204

